# జమీన్ రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 59 సంచిక: 48
2-12-1988
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు    మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# ఉరిశిక్ష పడలేదని జనంలో అసంతృప్తి!

## బషీర్ హత్యానేరంలో ముగ్గురికి జీవిత ఖైదు

జిల్లానంతటినీ అట్టుడికించిన పఠాన్ బషీర్ ఖాన్ హత్యానేరంలో ముద్దాయిలు ముగ్గురికీ జీవితఖైదు విధించారు. నాల్గవ ముద్దాయి నిర్మలను నిర్దోషిగా వదిలివేశారు. పతినిచంపినపాతకి ఫాతిమాకేసుగా ప్రసిద్ధమైన ఈ కేసుపై జిల్లాజడ్జి శ్రీ ఎస్. జయరామరెడ్డి 29 తేది మధ్యాహ్నం తనతీర్పు ప్రకటించారు.

బషీర్‌ను 1988 మే 20 తేది అర్థరాత్రి నెల్లూరు అనిల్‌హాలు సమీపంలోని తనస్వంత ఇంట్లో భార్య ఫాతిమా, ఆమె ప్రియుడు వెంకటేశ్వరప్రసాద్, అతని స్నేహితుడు వగ్గు వరప్రసాద్‌లు కలిసి పరమ కిరాతకంగా చంపారన్నది ప్రాసిక్యూషన్ నేరారోపణ. శవంతోసహా ముద్దాయిలు ముగ్గురూ అనెల 22 తేదినే పోలీసులకు పట్టుబడినప్పటికీ, కేసు విచారణ ఈ ఏడాది సెప్టెంబరు 26 తేదికాని ప్రారంభంకాలేదు. ఆతర్వాత ఈరెండు నెలలో సెషన్స్‌జడ్జి శ్రీ జయరామరెడ్డి గారు దాదాపు 30మందిసాక్షులనువిచారించి ఉభయపక్షాల న్యాయవాదుల వాదనలువిని తీర్పుచెప్పారు.

''మానవతారహితంగా, పాశవికంగా జరిగిన ఈ హత్యకేసులో నేరస్తులకు ఉరిశిక్ష విధించవలసివుంది; అయితే ముద్దాయిలు చిన్న వయస్కులు కావడంవల్ల ముగ్గురికి జీవితఖైదుమాత్రం విధిస్తున్నాను. ఫాతిమాబేగం, ఆమె ప్రియుడు వెంకటేశ్వరప్రసాద్‌లు ఇద్దరే ఈ హత్యకు పూర్తిగాబాధ్యులు; వగ్గు వరప్రసాద్ వీరితో కలిసి హత్యకు కుట్ర పన్నాడన దానికి ఆధారాలులేవు; కాని, హత్యలో అతడు భాగస్వామ్యం వహించాడనడానికి సాక్ష్యాలున్నాయి. అందువల్ల జీవితఖైదుతోపాటు, వెంకటేశ్వరప్రసాద్, వరప్రసాద్ లిద్దరికీ బషీర్ ఇంట్లోకి అక్రమంగా ప్రవేశించిన నేరానికి మరొక ఏడేళ్ళ కఠిన కారాగార శిక్ష విధిస్తున్నాను. రెండు శిక్షలూ ఏకకాలంలో అనుభవించాలి'' అని పేర్కొన్నారు న్యాయమూర్తి తమ తీర్పులో.

వంద పేజీల సుదీర్ఘమైన ఈ తీర్పు ప్రతిలో న్యాయమూర్తి పలు సుప్రీంకోర్టు తీర్పులను ఉదహరించారు. ఫాతిమాబేగం కూతురు మల్లికాబేగం సాక్ష్యాన్ని ఆయన ప్రధానంగా స్వీకరించారు. తన తల్లి పతనప్రవృత్తివల్ల ఆ యువతి ఎంతో మానసిక వత్తిడిని, వేదనను అనుభవించి వుంటుందని కోర్టుకు అంతా విప్పిచెప్పడం ద్వారా ఆమె ఎంతో ఉపశమనం పొంది వుంటుందని వ్యాఖ్యానించారాయన.

ఫాతిమా, వెంకటేశ్వర ప్రసాద్‌ల అక్రమసంబంధం గురించికూడా జయరామరెడ్డిగారు పెక్కువ్యాఖ్యలు చేశారు.

—కొరవ 7 వ పేజీలో



బషీర్ హత్యానేరంలో జీవితఖైదు శిక్షపడినతర్వాత ముద్దాయిలు ముగ్గురూ. పతి శవంముందు పలావ్‌విందు సేవించిన పతివ్రతా శిరోమణి - బషీర్‌భార్య ఫాతిమా; ఆమె ప్రియుడు, బషీర్ హంతకుడు వెంకటేశ్వరప్రసాద్; అతడి మిత్రుడు హత్యలో అతని భాగస్తుడు వరప్రసాద్ -తన మొహం చూచినవారికి పాపం చుట్టుకొంటుందనికాబోలు చేయి అడ్డంపెట్టుకున్నాడు!

# జమీన్‌రైతు

## అగర్వాల్ నిరాకరించాలి!

లోకాయుక్తగా జస్టిస్ రాజేంద్రనాథ్ అగర్వాల్ నియామకమే కాదు, ఆయనకూడా వివాదాస్పదుడైనాడు. ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు ఈ నియామకం విషయంలో చూపిన తొందరపాటుతనం, అగర్వాల్ విషయంలో ప్రదర్శించిన ప్రత్యేకాసక్తి, చేసిన రభస దీనిని పెద్ద రాజకీయసమస్య గావించాయి. వివాదాలకు అతీతంగా, సర్వసమ్మతంగావుండవలసిన ఈ న్యాయవ్యవస్థ వీధులపాలైపోయింది, విలువలేకుండా గావించబడింది. అగర్వాల్ న్యాయదృష్టి గలవారైనా; రామారావుపట్ల వ్యక్తిగతమైన అభిమానం లేనివారైనా ఈ వివాదకర వాతావరణంలో ఆయన నియామకం జరిగితే అది వివాదాస్పదంగానే కొనసాగుతుంది, దానితిప్పు ప్రతిది అనుమానాస్పదంగానే వుండబోతుంది.

లోకాయుక్త నియామకంలో గవర్నరును గబ్బుపట్టించడానికి, తద్వారా గవర్నరు వ్యవస్థను అప్రతిష్ఠపాలు గావించడానికి, కాంగ్రెస్‌మీద దుమ్ముచల్లడానికి ఈ సమస్యను రామారావు పూర్తిగా వుపయోగించుకోదలచారు. తొలుతతొలుత మంత్రివర్గ సిఫారసును కప్పుమూసుకొని ఆమోదించకుండా ఇతర పెత్తనాలు ఈమె కెందుకు అని శ్రీమతి కుముద్‌బెన్ జోషిమీద ప్రజలు, ప్రతిపక్షాలు దురభిప్రాయపడ్డారుగాని, నిదానంగా విలంబనకారణాలు ఒకటొకటి బయటకు వస్తూ, ముఖ్యమంత్రి అబద్ధాలతో అందరినీ ఎట్లా పెడత్రోవ పట్టించగలిగాడో అనేది ఇప్పుడిప్పుడు తెలిసికోగలుగుతున్నారు. గవర్నరు తన అధికారాలకు మించి వ్యవహరించిందా, ముఖ్యమంత్రి ఈ విషయంలో అనుసరించవలసిన పద్ధతులు అనుసరించాడా అనేది నిష్పాక్షిక విచారణలోకాని వెల్లడికావు. అగర్వాల్ నియామకం విషయంలో ఇంత పట్టుదల చూపడంలో రామారావుకు ఏదో స్వప్రయోజనం వుందని అనుమానించడానికి ఈ ఒక్క వాస్తవం చాలు: మహిళా బహిర్భూములకు, చాకిరేవులకుకూడా 'తెలుగు' తోక విధిగా తగిలించే ముఖ్యమంత్రి, ఎక్కడోవున్న తెలుగుతెలియని అగర్వాలాను ప్రతితరవ తీసుకరావడంలోని అంతర్యమేమిటి? ఆలోచించండి!

లోకాయుక్త నియామకం విషయంలో తప్పొప్పులు నిర్ణయించడం ఇక్కడ మా వుద్దేశ్యంకాదు. కాని ఈ వివాదసృష్టికర్త ముఖ్యమంత్రి అనేది ఆయన ప్రకటనలు, ఒకటొకటిగా తర్వాత వెల్లడవుతున్న విషయాలు చాటుతున్నాయి. మొదట అగర్వాల్ నియామకం మంత్రివర్గ నిర్ణయం అనే అభిప్రాయం కల్గించాడు. తర్వాత మంత్రివర్గం తీర్మానించలేదని, తన నిర్ణయమే మంత్రివర్గ నిర్ణయమని మాటమార్చాడు. అగర్వాల్‌ను లోక్ ఆయుక్తగా నియమించి, ఆయనకు ముందురోజు రాత్రి స్వాగతవిందు ఏర్పాటుచేసి, దానికి గవర్నరునుకూడా ఆహ్వానించి, 15 తేది పదవీస్వీకారోత్సవానికి పాసులుకూడా పంపకంచేయించాడు; ఇవన్నీ గవర్నరు ఆమోదం రాకముందే జరిగిపోయాయి. మొన్న మాజీమంత్రి కేశవరావు ప్రకటననుబట్టి- అసలు లోకాయుక్తగా నియుక్తుడయ్యే న్యాయమూర్తి పేరులేకుండానే గవర్నరుకు ఫైలు పంపబడిందట; కేశవరావు ప్రకటనను ప్రభుత్వ ప్రతినిధి ఎవ్వరూ ఖండించలేదు. ఈవిధంగా వెలుగుచూడని లోటుపాట్లు ఎన్నోవున్నట్లు అనుకోవలసివస్తున్నది. వీటన్నిటిని మరుగుపరచి ప్రజలనే కాకుండా, ప్రతిపక్షాలనుకూడా కప్పుకప్పి గవర్నరును గలభాపట్టించి ముఖ్యమంత్రి రాజకీయ ప్రయోజనాన్ని పొందజూచాడు; ఢిల్లీలో ప్రధాని ఇంటిని ముట్టడించడంద్వారా జాతీయ అంతర్జాతీయ వార్తా ప్రాధాన్యం పొందినట్లు, లోకాయుక్త వ్యవహారంద్వారాకూడా రామారావు దేశప్రజలదృష్టిని ఆకర్షించదలచాడు. "ఆరుకోట్ల ప్రజల ప్రతినిధి"నైన తనముందు గవర్నరెంత అనే నిరంకుశ ధోరణికూడా రామారావు మాటలలో వ్యక్తమవుతుంది.

ఈ విషయాలెట్లావున్నా, హైకోర్టులో అగర్వాల్ ఏవిధంగా అఫిడవిట్ ఇచ్చివున్నా ఆయన వివాదాస్పదుడైనాడు; ఇప్పుడేకాదు అంతకుముందుకూడా ముఖ్యమంత్రికి వ్యక్తిగతంగా సన్నిహితుడనే అపవాదుకు గురియైనాడు. అటువంటివ్యక్తి గవర్నరు ఆమోదించి లోకాయుక్త అయినా ఆయనకుగాని, ఆ స్థానానికిగాని గౌరవం విలువ ప్రతిష్ఠ వుండవు. అందువల్ల ఆయన తనకుతానుగా ఈ నియామకాన్ని నిరాకరించి వెనుదిరిగిపోవడం ఉత్తమం!

---

# జమీన్‌రైతు

2-12-1938

20 పేజీలు అణా

### మౌలానా షౌకతాలీ అస్తమయం

26 తేది ఉదయం 9-30 గంటలకు న్యూఢిల్లీ యందు స్వర్గస్థులైరని వినుటకు విచారించని భారతీయుడుండడు. సహాయ నిరాకరణంలో పోరాడిన ప్రసిద్ధనాయకులలో వీరొకరు. 19సం॥ క్రిందట అసహాయోద్యమందు వీరు చేసిన సేవ ప్రఖ్యాతమైనది.

సోదరుడు మహమ్మదాలీతోకూడా గాంధీగారివెంట దేశమంతటను సంచరించి హిందూముస్లిం సఖ్యతకు ప్రచారం చేసిరి. ముస్లింలీగు కాంగ్రెస్ నుండి విడిపోయిన తరువాత అలీ సోదరులు జాతీయ పక్షమును ఓడిరి. రౌండు టేబిలు సమావేశమునకు ముస్లిముల పక్షాన వెళ్ళిరి. అవసానకాలంలో కేవలం ముస్లింలీగు ప్రచారమునకే వినియోగించిరి. వీరి అస్తమయం వలన ముస్లిం ప్రపంచానికి, దేశానికి గొప్ప లోటు కలిగినది.

### జమీందారీ విచారణ రిపోర్టు

ప్రభుత్వంవారిచే ప్రకటింపబడిన జమీందారీ విచారణ కమిటి నివేదికను గురించి యీనెల 18 తేది లోపుగ ఆంధ్రరాష్ట్రీయ జమీన్ రైతు సంఘము చర్చించునదనియు, అంతవరకును దీనిని గురించి వ్యక్తిగతంగా ఎవరును అభిప్రాయమీయగూడదనియు ఆంధ్రరాష్ట్రీయ జమీన్ రైతు సంఘాధ్యక్షుడు శ్రీ బెజ్జ్రపెగడ మహేశ్వరశర్మగారు ప్రకటించుచున్నారు.

### గాలివాన

24 తేది గాలివాన ఆరంభమై 25 తేదీన ప్రచండంగా వెలరేగి కృష్ణ, గోదావరి, విశాఖపట్నం, గుంటూరు జిల్లాలలో అపారమగు నష్టం కలిగించింది. కృష్ణజిల్లాతూర్పుభాగమంతయు

## 50 ఏళ్ల క్రితం ఈ వారం

మమారు 20 మైళ్ళ లోపలవరకు నాశనం చేసింది. సముద్రంపొంగి గోదావరి నదిగుండా తీవ్రపైకి దుమికెను. వేనకువేలు పూరిండ్లు నేలమట్టమైనవి. పెంకుటిండ్లకు,పశువులకు విశేష నష్టం కలిగినది. కోసినపైరు, నిలువనవుండే పైరు నాశనమైనది. పశుగ్రాసమునకుకూడా కరువగుచున్నది. బీదసాదలు నిలువనీడలేక తిండి లేక అల్లాడు చున్నారు.

### నెల్లూరుముచ్చట్లు

(విమర్శకుడు)

జిల్లాబోర్డు ఎలక్షనులో - కల్యాణరావు, నారసింహారెడ్డి, దుప్పూరు నారాయణరెడ్డి యీ ముగ్గురు కాంగ్రెసుకు యిద్దొరనీ, ఉక్కుస్తంభం అనుకున్న కందుకూరుడివిజన్ హరిజనుల రెండు ఓట్లు అటుపోయినవని రూఢివార్త.

ఎన్ని నిరుత్సాహాలున్నా కల్యాణరావు ఓటు దూమూర్తాలు ఏమైనా అటు పోవడానికి అస్కారంలేదు కావున ఇది సందేహానికి అస్కారం లేదని మా గట్టివాదం.

దుప్పూరు నారాయణరెడ్డిగారు, ముందురోజు జస్టీసు క్యాంపు వారికి ఓటు ఇవ్వను అనిచెప్పివంపి మరురోజు వుదయమే వారి అభ్యర్థనకూడా లేకుండా గోయిందన్న పాదాలకు నమస్కరించాలసిన కారకం అతనికేమీ లేదు. కావున అతని ఓటును అనుమానించనక్కర్లేదు.

నారసింహారెడ్డి, వెంకయ్యనాయుడు మాదిరి లెక్కతెలియని యంగళప్ప కాదు. గెలిచేపక్షానికి ఓట్లు యివ్వాలని అతని సంకల్పం- లెక్కవేసితే అవతల పక్షంలో ఒకటి తక్కువగా తేలింది. కాంగ్రెస్ మెజార్టీవుందని స్పష్టంగా తేలినందున నారసింహారెడ్డి కాంగ్రెస్‌కే ఓటుచేశాడు.

### కొండాయపాళెం రైలుస్టేషన్

కొండాయపాళెం రైలుస్టేషన్ 1 తేది నుండి ప్రారంభించారు. మెయిలు, ఎక్సుప్రెస్ నిలవవు. ప్యాసింజర్లన్నీ నిలుస్తవి.

నెల్లూర్లో స్టేషన్‌పెట్టి కొండాయపాళెం అనడం అపస్మారకం. మునిసిపాలిటీవారు తీర్మానించినట్లు నెల్లూరు సౌత్ అనడంబాగావుంది. పద్మనాభయ్యగారూ కొంచెం కుంచె ఆడించి ఆందోళన సాగించవయ్యా!

---

# స్వాతంత్ర్య పార్కులో గంజాయి పొగలు!

నెల్లూరు టౌన్‌లో మందుల షాపుల్లో డాక్టర్ల అనుమతి లేకుండానే 'కాంపోజ్' వంటి మత్తుకల్గించే మాత్రలను విచ్చలవిడిగా అమ్ముతున్నారు. ఈ అమ్మకాలు నెల్లూరుకే పరిమితం కాకుండా మండలాలకు, గ్రామాలకు ప్రాకుతున్నాయి. ఒకప్పుడు డాక్టర్లు వ్రాసేతప్ప సామాన్యులకు ఇవ్వమని చెప్పే మందులషాపు యజమానులు ఇప్పుడు ఎన్ని కావాలన్నా ఇస్తున్నారు,

ఇదిలావుండే-మన స్వాతంత్ర పార్కు ఎక్కువగా గంజాయి ప్రియులకే వుపయోగపడుతున్నది. సాయంత్రంపూట ప్రశాంత వాతావరణంకోసం అక్కడికెళితే ఈ గంజాయి ప్రియులు బల్లలను ఆక్రమించి, గంజాయి అంటే తెలియనివారికి సైతం ఆసక్తి కలిగించేవిధంగా రైలింజనులా 'గుప్పు గుప్పు'మని పొగవదలి వాతావరణాన్ని కలుషితం చేస్తున్నారు.

వీరి నియంత్రణకు వెంటనే చర్యలు తీసుకోనిపక్షంలో అభివృద్ధిలోకి రావలసిన యువత నిర్వీర్యమైపోయే ప్రమాదంవుంది. పోలీసు అధికారులు, డ్రగ్ ఇన్స్పెక్టర్లు వెంటనే కఠినచర్యలు తీసుకోవలసిందిగా కోరుతున్నాను.

నెల్లూరు — ఎ. సూర్యప్రకాశరావు.

### కొడవలూరు గిరిజనులకు ఇండ్ల పట్టాలు ఇవ్వాలి!

మండల కేంద్రం అయిన కొడవలూరులో పి. డబ్ల్యు. డి. బంగ్లా ఎదురుగా వున్న యస్ 5-68 సెంట్లు మాగాణిభూమిని ఇండ్లస్థలాలకుగాను ప్రభుత్వం కొనుగోలు చేసింది. ఈభూమిని గిరిజనులకు ఇతర కులాలవారికి 31-8-88 తేదిన ఇండ్ల స్థలాలకు పట్టాలు ఇచ్చారు.

కాని పేదలకు యిచ్చిన ఈ స్థలాలను సర్వే చేసి పంచకుండా, ఈస్థలంలోనే మండల ఆఫీసు కట్టించి పేద గిరిజనులకు ప్రభుత్వం ద్రోహంచేసింది. దీనికి దక్షిణంగావున్న పాతగిరిజనకాలనీలో ఇరుకు




ప్రదేశంలో నివసించే 35 గిరిజనుల కుటుంబాలకు తూర్పుగావున్న స్థలాలు ఇచ్చారు. వీటిని సర్వేచేసి పంచమంటే, ఆ స్థలంలో ఆసుపత్రికట్టాలని మండల రెవిన్యూఅధికారి చెబుతున్నారు. గిరిజనులకు యిచ్చిన ఇండ్లస్థలాలను వెంటనే సర్వేచేసి పంచవలసిందిగా కలెక్టరుగారికి విజ్ఞప్తిచేస్తున్నాను.

విడవలూరు — షేక్ సాలారుద్దీన్

### ఎంతకాలం ఈ నిరీక్షణ?

దాదాపు 1984 సం. నుంచి జి. ప్ర. ప. పాఠశాలలయందు ఉపాధ్యాయ నియామకాలు జరగలేదు. ఉపాధ్యాయులులేక ఎన్నో ప్రాథమిక పాఠశాలలు అనేక గ్రామాలయందు మూతబడి వున్నాయి. ఎంతోమంది అర్హత కల్గిన నిరుద్యోగ

—తరువాయి 12వ పేజీలో

# శ్రీనివాసులురెడ్డి నెల్లూరు ప్రసంగం షరామామూలే!

సీనయ్యసేవ మొన్న 28 తేది వం పెట్టిన విందవర్ధాలి అనుకున్నదానికంటే బాగా జరిగింది. తన మేనల్లుడు శ్రీ సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డిని పదవినుండి దించడానికి తెలుగుదేశం చేస్తున్న ప్రయత్నాలను నిరసించడానికి ఏర్పాటించిన ర్యాలీ ఇది. దేశర్ల మండలాధ్యక్షుడు శ్రీ కొమ్మి లక్ష్మయ్యనాయుడుపై జరిగిన హత్యా ప్రయత్నాన్ని ఖండించడంకూడా పనిలో పనిగా తలపెట్టారు.

నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి రెవిన్యూ మంత్రిగా వెలిగిపోయిన తర్వాత నెల్లూరు టౌనులో జరిపిన రెండవసభ ఇది. రెండింటి మధ్య దాదాపు ఏడాది ఎడం వుండడంతో కొత్తగా సభ పెట్టినట్లే జనం వేలంవెర్రిగా వచ్చారు. సీనయ్యకు జిల్లాలో కుడిఎడమ భుజాలుగావుంటున్న శ్రీ కోదూరు శ్రీరంగారెడ్డి, శ్రీ రావెళ్ల అంకయ్యగౌడ్ తమ శక్తివంచన లేకుండా జనసమీకరణ చేసినట్లున్నారు.

ముందుగా టౌనులో పెద్ద ఊరేగింపు! చిన్నబజారు, ట్రంకురోడ్డు వగైరా

## సింహపురి

ప్రధాన వీధులగుండా నాయకులందరూ ఊరేగారు! టౌనులో శ్రీనివాసులు రెడ్డి పేరిట కాకుండా, మాదాసు గంగాధరం పేరిట స్వాగత తోరణాలు వెలియడం విశేషం. పైగా 'నెల్లూరుజిల్లా కాపునాడు యువజన సంఘం' పేరిట వున్నాయవి! జిల్లాలో కాపునాడు ఎప్పుడు ఏర్పడిందో మరి!

సభావరణం జనంతో కిటకిటలాడింది. చక్కెర ఫ్యాక్టరీ చేర్మన్ శ్రీ సామంతు సుబ్బారెడ్డి, కోదూరు శ్రీరంగారెడ్డి, కొమ్మి లక్ష్మయ్యనాయుడు, సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డి తదితరులంతా సుదీర్ఘోపన్యాసాలు చేశారు. అందరికంటే ఆసక్తిదాయకమైన ప్రసంగం రావెళ్ల అంకయ్యగౌడ్‌ది! తనదైన పరిభాషలో ఆయన మాట్లాడిన మాటలలో ఎవర్ని తిట్టాడో, ఎవర్ని పొగిడాడో ఎవరికీ అర్థంకాలేదు. ఆఖరకు శ్రీనివాసులురెడ్డిని కూడా వదలిపెట్టలేదు తన తిట్లగుంపు తీర్చుకోవడానికి!

మాదాసు గంగాధరంగారు 'ఆదీవా రైతు' పై వీరావేశం వ్యక్తంచేశారు. తాను ఏ ముఖ్యమంత్రికీ పడిగాపులు కాయలేదట. అమ్మ పుట్టింటి ఘనత మేనమామ ఇంట్లోచెప్పి ప్రయోజనమేముంటుందో మరి!

చివర్న శ్రీనివాసులురెడ్డి వంతు వచ్చేసరికి జనంలో ఓపిక నశించింది. గుంపులు గుంపులుగా లేవడం మొదలుపెట్టారు. పాపం సీనయ్య మైకులో అందరికీ వినయాతి వినయంగా విన్నవించుకున్నారు. లేవ వద్దని! —కొరవ 8వ పేజీలో



## పద్యాలు గేయాలు

### రక్తదాత

- వెన్నెలకంటి రాజేశ్వరప్రసాద్ -

ఎవ్వాని తలపులో ఎనలేని కారుణ్య
 భావాల పూదోట పల్లవించు
ఎవ్వాని డెందమ్ము ఎల్లవేళలయందు
 పరుల సేవలలోన పరవశించు
ఎవ్వాని చూపులో ఘనమడించిన ప్రేమ
 బాధనొందెడు రోగి సేదదీర్చు
ఎవ్వాని త్యాగమ్ము ఇలలోన తులనేని
 బహుమానమై కొత్త బ్రతుకునిచ్చు
అతడు విశ్వమానవకోటికి ఆప్తజనుడు
మహిత మానవతాపథ మార్గదర్శి
ఇలను మరియొక జన్మంబునిడు విధాత
రాగసంజీవన ప్రదాత రక్తదాత.

### శిధిలాన్ని శిఖరంగా!

* సి. నారాయణరావు *

పదిలమైన స్థితి ఉండే
పటిమండి లోటైతే
ప్రతికూలత ఎదురైనా
పగ్గం పట్టొచ్చుగాని,
అస్తవ్యస్త పరిస్థితిలో
అస్త్రము సంధింపగల్గు
అతి సాహస సేనాపతి
కాంగ్రేసుకి కావాలని,
'నేదురుమల్లి'కి
నేడే సారథ్యం ఇచ్చారు!
జీర్ణ కళేబరంలోకి
జవసత్వాలు తెచ్చారు!
కానికాలమెదురైనా

—కొరవ 11వ పేజీలో

# చూడడానికి కనులు లేకున్నా బాపిరాజు నవలలపై చక్కటి పరిశోధన చేశాడు!

శ్రీ మన్నవ సత్యనారాయణ "శ్రీ అడివి బాపిరాజు నవలాసాహిత్యానుశీలనము" అనే విషయంపై పరిశోధనచేసి డాక్టరేటు పొందిన పరిశోధకుడు. ఆయన అంధుడు. కళ్ళున్నవాళ్ళు పరిశోధనలు చేసి డాక్టరేట్లు పొందడం సహజం; కాని చూపు లోపించిన మన్నవ శ్రీ బాపిరాజు నవలలపై పరిశోధనచేసి డాక్టరేటు సంపాదించడం చెప్పుకోదగ్గ విషయం. మన్నవ ఎమ్. ఎ. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు.

ప్రస్తుత కాలంలో నవలా సాహిత్యానికి వున్న ప్రచారం మరి ఏ సాహిత్య ప్రక్రియకు లేదనడం అతిశయోక్తికాదు.

డాక్టరు మన్నవ సత్యనారాయణగారిని గురించి కవిపండితుల అభిప్రాయములను గమనింపుడు.

**డాక్టర్ మన్నవ సత్యనారాయణకు వాకాటి పెంచలురెడ్డి ప్రశంస!**

"ఇతరత్ర తనకు తెలపకుండానే తెలుసుకోటానికి వ్యక్తితో అంతర్ దృష్టి అవసరం. బాహ్యదృష్టి వున్నవారికో

—కొరవ 11వ పేజీలో

# ఆహ్లాద రుచిరం- ఆస్వాద మధురం!

"భక్తిసౌరభం" అనే ఈ గ్రంథం 32 గేయ ఖండికల కవితాసంకలనం. భక్తి సుమాలనుండి వెల్వడిన కవితా పరిమళాలివి. రచయిత శ్రీ సురభి నరసింహం; వి. ఆర్. కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. పత్రికలలో అప్పుడప్పుడు ప్రచురించిన ఖండికలన్నింటిని క్రోడీకరించి పొత్తముగా రూపొందించారు. పలు పద్యాలను గేయాలను వ్రాయడం, వాటిని సభలలో శ్రవణపేయంగా గానం చేయడం వీరికి అలవాటు. వీరి కవితలన్నింటిలో భక్తి అంతర్వాహిని. సర్వేశ్వరుని స్మరించడం వల్ల ద్రవించిన మనస్సులో ఏకధారగా బయల్వెడలిన చిత్తవృత్తియే భక్తియని మధుసూదన సరస్వతి చెప్పారు. కలియుగంలో చిత్తశాంతికి భక్తియే శరణ్యం.

వీరి కవితలో నవవిధ భక్తులు తొణికిసలాడుతున్నాయి. గొప్పవారిని పూజించడం మన విద్యుక్త ధర్మమనే భావాన్ని ఈ కవితలో ధ్వనింపచేశారు. వీరి కవితలు ఆర్ష సంస్కృతికి పట్టుగొమ్మలై ఇహపరములకు తారకములయినవి. మృదుమధురమయిన శైలి, శ్రవణపేయమయిన

—కొరవ 10వ పేజీలో

గ్రంథ సమీక్ష
**భక్తిసౌరభం**
రచయిత:
**సురభి నరసింహం**
తెలుగు లెక్చరర్
16/155, మధ్యపతివారివీధి, నెల్లూరు
వెల: ఐదురూపాయలు
సమీక్షకుడు:
**డా. ఉడాలి నరసింహశాస్త్రి**
ఎం. ఎ., పిహెచ్. డి.

# చిప్పలేరులో తొమ్మిది మంది సజీవ జలసమాధి!

కావలి మండలం జువ్వలదిన్నె సమీపంలో 27 తేది మధ్యాహ్నం ఒక నాటు పడవ బోల్తాకొట్టి 9 మంది సజీవంగా జల సమాధయ్యారు. వివరాలిలా ఉన్నాయి. జువ్వలదిన్నె సమీపంలోని చిప్పలేరులో ఈ దుర్ఘటన జరిగింది.

పేరుకు ఏరేకాని, పెద్ద వాగులాగా వుండే చిప్పలేరు జువ్వలదిన్నెకు కిలో మీటరు దూరంలో సముద్రంలో కలుస్తుంది. ఈ ఏటిలో మంచినీటి ప్రవాహం వుండేది వర్షాకాలంలోనే. తతిమా సమయంలో ఆటుపోటుకు సముద్రపునీరు ప్రవేశించి రెండు కిలోమీటర్ల దూరం వరకు సన్నటి పొడవైన జలాశయంవలె కన్పిస్తుంటుంది.

చిప్పలేరుకు దక్షిణంగా జువ్వలదిన్నె, ఉత్తరంగా అన్నగారిపాలెం గ్రామాలున్నాయి. నాటు పడవలతో చిప్పలేరును దాటి ఈ గ్రామాలమధ్య రాకపోకలు సాగించడం అలవాటే. వ్యవసాయకూలీలకూ ఈ జలమార్గమే రహదారి!

27 తేది ఉదయంకూడా కొందరు వ్యవసాయ కూలీలు అన్నగారిపాలెం నుంచి జువ్వలదిన్నె మజరా పందిగుంటకు పని కోసమని వెళ్ళారట. అయితే అక్కడి రైతులు ఆరోజు పని తక్కువగా వుందని కొందర్ని వెనక్కు పంపేశారట. పనిదొరకక అట్లా వెనుదిరిగిన 16 మంది స్త్రీలు, ఇద్దరు మగవారు పందిగుంటలో నాటు పడవఎక్కి అన్నగారిపాలేనికి తిరిగి బయల్దేరారట.

మధ్యలో ఏమిజరిగిందో ఏమో, హఠాత్తుగా పడవ అదుపుతప్పింది. లోపలున్న ఆడకూలీలు కొందరు భయపడిపోయి పడవకు తెడ్డువేస్తున్న గుండెబోయిన పెనుకొండయ్యను (60) గట్టిగా వాటేసుకున్నారట. పడవను అదుపులోకి తేవడానికి అతనికి అవకాశం చిక్కలేదట. ఈ పెనుగులాటకు, అలజడికి పడవకాస్తా బోల్తాపడిపోయింది. లోపలున్నవారందరూ నీటిపాలైనారు

అయితే పడవలో ఎక్కిన ఇద్దరు మగకూలీలు ప్రాణాలకు తెగించి మునిగిపోతున్న మహిళలను గట్టుకు చేర్చడానికి ప్రయత్నించారట; అట్లా 8 మందిని వడ్డుకు తీసుకొనివచ్చారు వారిద్దరు. అప్పటికి మిగిలిన 8 మంది మహిళలు జలసమాధి అయిపోయారు. వారితోపాటుగా కొండయ్యకూడా మృతిచెందాడు. అతడు మంచి ఈతగాడట. కాని తనను వాటేసుకునివున్న ఆడవారిని తొలగదోసుకోలేకపోవడంతో నీటి అడుగుకు చేరిపోయాడు. అతడు ఖాళీగా వుండివుంటే మరికొందర్ని అయినా ప్రాణాలతో గట్టుకుచేర్చివుండేవాడని చెప్తారు.

ఈలోగా దూరంగా చేపలు పట్టుకుంటున్న పల్లెపువాళ్ళువచ్చి, అన్ని మృతదేహాలను వెలికితీశారు. చనిపోయిన వారందరూ యాదవులే. వడ్డుకుచేరిన వారందరినీ కావలి ఆస్పత్రిలో చేర్పించి, చికిత్స చేయించారు.

బంగాళాఖాతంలో పుట్టిన వాయుగుండంవల్ల ఆరోజు సముద్రపుటలలు ఎక్కువగా వుండి, చిప్పలేరులో ఉప్పునీరు ఎగదన్నిందట. ఆ ప్రవాహ వడివడిని ఆ చిన్నపడవ తట్టుకోలేకపోయినట్లుంది.

పైగా పదిమందిని మించి భరించలేని చిన్నపడవ అది. సాధారణంగా లోపలకు చేరేనీటిని డబ్బాతోతీసిపోస్తుంటారట. రద్దీవల్ల ఆరోజు అది జరగలేదు. అలలతాకిడికి పడవవాలగానే, నీళ్ళు లోపలకు ప్రవేశించి ముంచేసింది.

ప్రమాదం జరిగిన తర్వాత కలెక్టరు శ్రీమతి ప్రీతిసుదాన్, ఎస్.పి. పూర్ణచంద్రరావు తదితరులువెళ్ళి ప్రమాద స్థలం సందర్శించారు.

ఈ ప్రమాదంలో మృతిచెందినవారి పేర్లివి—

గుండెబోయిన పెనుకొండయ్య (60), పులి వెంకాయమ్మ (20), రమణమ్మ (40) కోటమ్మ (60), చెన్నబోయిన కోటీశ్వరమ్మ (12), నారాయణమ్మ (14), కోటీశ్వరి (15) గడ్డగుంట లక్ష్మీకాంతమ్మ (18), ఎండేటి కాంతమ్మ (58).

బస్సులు, లారీలు వంటి వాహనాల పరిస్థితిని సంవత్సరానికి ఒకటి రెండుసార్లు పరిశీలించి సర్టిఫికేట్ ఇవ్వడం జరుగుతుంటుంది. ఇటీవల పడవ ప్రమాదాలు ఎక్కువై పదుల సంఖ్యలో సామాన్య ప్రజలు ప్రాణాలు పోగొట్టుకొంటున్నారు. అందువల్ల నదుల్లో, వాగుల్లో ప్రజల రవాణాకు వుపయోగింపబడుతున్న పడవలకుకూడా లైసెన్సుపద్ధతి ప్రవేశపెట్టడం అవసరం.

★

## కాంగ్రెస్ సాయం

ఈప్రమాదంలో మృతులకు రాష్ట్ర కమిటీతరఫున ఒక్కొక్కరికి వెయ్యి రూపాయలచొప్పున ఆర్థిక సహాయం ప్రకటించారు శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి. 29 తేది ఉదయం కావలి ఎమ్మెల్యే శ్రీ కలికి యానాదిరెడ్డిద్వారా ఆడబ్బును మృతుల కుటుంబాలకు అందజేశారు. మాజీ ఎమ్మెల్యే శ్రీ సి. వి. శేషారెడ్డి, యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ మెట్టా చంద్రశేఖరరెడ్డి, కావలిటౌన్ కాంగ్రెస్ అధ్యక్షుడు వెంకటేశ్వరచౌదరి ప్రభృతులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

జనార్దనరెడ్డి పి.సి.సి అధ్యక్షుడు కాగానే గోదావరిజిల్లా పసమద్దుద్రద్రేయిలో జరిగిన ప్రమాద బాధితులకూ సహాయం ప్రకటించారు. జనార్దనరెడ్డి కొత్త అధ్యక్షుడైన తర్వాత ఏర్పరచిన కొత్త సాంప్రదాయమిది! ఆపదలోవున్న ప్రజలకు దగ్గరయ్యే సత్కార్యం ఇది!

# ప్రియుడితోకల్సి భర్తను చంపి శవాన్ని మూడుమైళ్ళు మోసి బావిలో వేసిన మహాసాధ్వి!

ఫాతిమా కేసువిచారణ కొలిక్కిరాకముందే డి. ఎస్. పి. శ్రీ నరసింగరావు మరొకవార్త వెలికితీశారు. సాధ్వీలలామగా ఫాతిమాకు స్వయాన సోదరి అనదగిన మరొక పాతకి ఘనచరిత్రను వివరించారు.

వెంకటాచలం మండలం కొమ్మలపూడి గ్రామానికి చెందిన ఎలగలం బుజ్జమ్మ (85) అనే వివాహిత స్త్రీకి, చేపూరు శ్రీహరి (30) అనే రైల్వే ఉద్యోగికి చాలాకాలంగా అక్రమసంబంధం వుందట. ఇది ఆమెభర్త చినమస్తానయ్యకూ తెలుసు. అయితే వీరిద్దరి కామప్రవృత్తి శృతిమించడంతో శ్రీహరిని తనయింటికి రావద్దని మస్తానయ్య హెచ్చరించాడట. అయినా రాకపోకలు ఆగినట్లులేదు. ఫలితంగా తరచు కలతలు, కలహాలు సామాన్యమైపోయాయట.

తమస్వేచ్ఛకు అడ్డంగావున్న మస్తానయ్యను అంతమొందించాలని శ్రీహరి నిర్ణయించాడట. 14 తేది రాత్రి మస్తానయ్య ఇంట్లోనే అతడ్ని హతమార్చినట్లున్నాడు. ఈ హత్యలో బుజ్జమ్మకు భాగమున్నదని వదంతి.

చంపేసిన తర్వాత వీరిద్దరూ కలిసి మస్తానయ్య శవాన్ని ఒక గోతంలోమూటకట్టారట. అక్కడి నుంచి, మూడు మైళ్ళ దూరంలోవున్న పాడుబడిన రైల్వేస్టేషను వరకు అర్ధరాత్రి సమయంలో, పొలాలవెంబడి మోసుకొనివెళ్ళారట. శవానికి కాళ్ళు బండలు రెండు కట్టి, ఒక బావిలో పడవేశారట.

తర్వాత బుజ్జమ్మ హత్య విషయం తనకేమీ తెలియనట్లు నటించి, తనభర్త కన్పించడం లేదని పోలీసుకు ఫిర్యాదు కూడా చేసిందట! గ్రామంలోకూడా తనభర్త ఎక్కడికో వెళ్ళిపోయాడని చెప్పిందట.

27 తేది వరకు - అంటే 14 రోజులు ఈ హత్య వార్త వెలికిరాలేదు. 27 తేది ఉదయం కొందరు పశువుల కాపర్లు బావినుంచి దుర్వాసన రావడం గమనించి గ్రామంలో చెప్పారట. ఇది తెలిసి పోలీసులు రంగప్రవేశంచేసి నీళ్ళు తోడించే సరికి కుళ్ళిపోయిన మస్తానయ్య శవం బయటపడింది.

28 తేది ఉదయం డి ఎస్ పి శ్రీ నరసింగరావు కొమ్మలపూడి వెళ్ళి బుజ్జమ్మను నిలదీసేసరికి ఆమె అంతా చెప్పేసిందట. అయితే ఈ హత్యతోతనకేమీ సంబంధం లేదని, పోలీసులకు సమాచారం అందిస్తే తననూ చంపేస్తానని హరి బెదిరించడంతో భయపడి నోరుమూసుకుని వున్నానని ఆమె డి ఎస్ పికి చెప్పిందట పాపం!

### కొమ్మలపూడిలో మరో 'ఫాతిమా'!

★

# జిల్లావార్తలు

### కొడవలూరులో ఇళ్ళకై ఆందోళన

కొడవలూరు మండలంలోని దక్షిణ గిరిజన కాలనీ నివాసులు 22 తేది తమ కాలనీలో శాశ్వత గృహాలను నిర్మించాలని కోరుతూ ఒక ప్రదర్శన జరిపారు. అనంతరం మండలాధికారిగారికి, మండలాభివృద్ధి అధికారిగారికి వినతి పత్రాలుకూడా సమర్పించారు.

### బిట్రగుంట యువకునిపై దాడి

బిట్రగుంటలో 25వ తేది ఒక వర్గం మరొక వర్గంపై మారణాయుధాలతో దాడి జరిపినందువల్ల తిరుమలేశు (21) అనే యువకుడు తీవ్రంగాగాయపడ్డాడట. గాయపడ్డ తిరుమలేశును చికిత్స కోసం కావలి ప్రభుత్వాసుపత్రిలో చేర్పించారట. పాత కక్షలే ఈ దాడికిగల కారణాలని తెలుస్తున్నది. పోలీస్ దర్యాప్తు జరుపుతోంది.

### నెహ్రూ శతజయంతి

నెహ్రూ శతజయంతి సందర్భంగా నెల్లూరు పీబ్లు పబ్లిసిటీ కార్యాలయం బాలల దినోత్సవం జరిపింది. నెల్లూరు మండలంలోని తురకపాళెం గ్రామంలో ఉదయం ఆరోగ్యశిశువుల పోటీ నిర్వహించారు. విజేతలకు మైపాడు పి. హెచ్. సి. బహుమతి ప్రదానంచేసింది.

—తరువ 12 వ పేజీలో

# శివారెడ్డి పద్యాలు

### శివారెడ్డి ఫిర్యాదు

పక్షిముందు ప్రాణి వచ్చి పోషణకై
పామనుకుంటే, అంతెగాని వదలి
పక్షిసి రెక్కలతో వదలేస్తే
అటువంటి దారి దొరక రాదు!

కనిపించేను దాని కమ్మంటివడమేదు,
చదువులేదు వనదు వరపులేదు,
రామమూర్తిగారు! ఏమైన యీ వాట
కవికి నాకు యింకొక కవితకు!

### ఎన్. టి. రామారావు

వత్రికోప నీకు పట్టాభి భద్రమ్ము
పూలపత్రికెక్కి పూజసేయ
వచ్చు ప్రాంతం, కింతా వాంగేది ఏముంది
వంచమాడు! నిజము నాకుదెలుసు!

కాలు దువ్వుతావు కాంగ్రెసు పార్టీపై,
రాళ్ళు దువ్వుతావు రాజీవ్ పైయి
అనుభవించుతావు ఆ పాపఫలితాన్ని
ముందుముందు ఆంధ్ర ముఖ్యమంత్రి!

కదలకదం కాంగి మడిగట్టి కూర్చుంటె,
రాకెట్ గంతుల రవ్వుకుంటె
ఇండియాకు మోక్షమెట్లుండివచ్చేర
ఇంటికాన సుబోధ జానిసురవు!

సినిమాలో బొమ్మ్యదేరి ఆరోజుల్లో
సింగార్చినావు కోట్లుకోట్లు,
పేదసాదకింత పెట్టింది ఏనాడు
లేదు, కొంపమునిగిపోదు టింతా!

నిండు మోసేదాన్లో
ముందుమునిసీవు, వచ్చెమోసం ప్రకటి!
ఎందుకు యీ మంత్రిత్వము
పెండలాక్లై ఇల్లు లేదు పెట్టి రికైనా!

ఇండియా ప్రధానివైతె, కవి యీదు
ముఖ్యమంత్రివైతె, ముందు మోసి

పోద్దీ యీ స్వరాజ్యంపోద్దీ,
యీ సామ్రాజ్యం
ముందుమోసిపోద్దీ మూర్తివాళ్లో!

తప్పవాప్పు తారతమ్యాలు తెమలేక
మంచిచెడ్డ తమకు మనవిలేక,
అందరొకటె యీదికంయల్లా పొరపాటు
ఏమిలేదు, యిట్లా ఏమిగాదు!

### సోమిరెడ్డి-శీనయ్య

శ్రీనివాసులురెడ్డి రీల్చిరెండాడాదు
పడువుగడిగినారు పదిమందిలో
పీకమనిష్టుర్తిగార్ని, చేతిదివెయ్యంది
అయ్యారేమిలేదు అడిపోస్తె!

సోమిరెడ్డికాళ్ళు ఏమార్తా ఎట్లార్తా
చెప్పరాదు చెప్తైతప్పగాదు
వాకుదేనికంది వడ్డైత్తినరికాక
ప్రాయమెక్కినాక పారిడిక్కు!

### జనార్దన రెడ్డి

నీవు లేపోమాపో నెల్లూరు చర్చాక
రిపబ్లిక్ నీకు తిన్నబెదర,
అన్నియున్నికాదు అరరప్ప టియిస్తె
సత్కరిస్త ఖాదీ కాల్చిదెస్తె!

### సుందరరాంరెడ్డి

సుందరరామా! ఏమని
అందర నీ త్యాగనిరతి యౌదార్యము, నీ
బంధువు, మిత్రుడు యీ కవి
కెందుకు శ్రీ ఇష్టా కింతా ఏమౌంతుంది!

### ఫాతిమ

ఎప్పరాచేసిన పాపము
ఇప్పుడనుభవానికొనది, యీ కాలంలో
అప్పిడిరప్పుడె, పాతిమ!
తప్పిపోయె నీకు మరణదండనదెట్లో?

తప్పుజెయనివాపు తంటాలుపడనోరు
రాటుమాట, ఎవరో నూదికోతపు
మగనిగొంతుబిసికి మటుమాయమొనరించు
దిక్కుమాల్న ఆడదెక్కడుంది?



## అధికారదర్పం

(1వ పేజీ తరువాయి)

చేసిన అంజనీగుడిలేదని తెలుసు. అయినా ఆ సేతు అడుగుతుందా లేదా అన్న విషయము తేల్చిచెప్పలేదు. అసలు అంత దూరంవచ్చి డ్యాంను చూడకుండానే వెళ్ళిపోయేంత నిర్లక్ష్యంగా ప్రవర్తించినవ్యక్తి జనన్ని పట్టించుకుంటాడని భావించడం పొరపాటేకదా!

జనం విషయంలో మాత్రం తనకింకా ఆకర్షణశక్తి తగ్గలేదని రుజువు చేసుకున్నారు ఎన్టీఆర్. ఆనం రామనారాయణ రెడ్డి ట్రాక్టర్లు, బస్సులలో పెద్ద ఎత్తున జనాన్ని తోలించి వాస్తవమే అయినా, స్వచ్ఛందంగా వచ్చినవారి సంఖ్యకూడా తక్కువలేదు.

తర్వాత సంగం మధ్యాహ్నం 12.45కి రెగ్యులేటర్ త్రిప్పి కావలి కాల్వకు నీళ్ళు వదిలాడు. ఏళ్ళనుండి నీళ్ళుపారుతున్న కాల్వలో ఇప్పుడు కొత్తగా నీళ్ళు వదలడానికి హెలికాప్టర్లోవచ్చినముఖ్యమంత్రిని చూసి జనం నవ్వుకున్నారు. పైగా కావలి కాల్వ త్రవ్వకంలో గత ప్రభుత్వం ఎంతో అలక్ష్యంవహించిందని, తమ ప్రభుత్వం దీన్ని మంజూరుచేసి పూర్తిచేసిందని గొప్పలు చెప్పుకున్నాడాయన. తోపాటు తదితర ఆరోపణలు షరా మామూలే!

తన పర్యటన సందర్భంగా జిల్లానాయకులను రెండుగా విడదీసి రెండుదగ్గర్లే వుండమని ముఖ్యమంత్రి ఆదేశించాడట. అందువల్ల రామనారాయణరెడ్డి, జి. ప. చేర్మెన్ సోమశిలలో, రమేష్ రెడ్డి, బెజవాడ పాపిరెడ్డి సంగంలో ముఖ్యమంత్రిని స్వాగతించారు. ముఖ్యమంత్రి మర్చిపోయిన ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డిని సోమశిలకు, నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డిని సంగంకు కేటాయించాడట నారసింహారెడ్డిగారు.

సోమశిలలో రామనారాయణరెడ్డి ముఖ్యమంత్రికి అత్యంత ఖరీదైన పట్టు శాలువా సమర్పించాడు. వేదికమీద ఇంకొక ఎర్రటి కాశ్మీరు శాలువ కూడా ఇచ్చాడు కాని, ఎన్టీఆర్ దానిని బెజవాడ గోపాలరెడ్డిగారికి సమర్పించాడు. సంగంలో పత్తి రవీంద్రబాబు ఏనుగంతౌండమంత పూలమాల వేసి ఫోటో తీయించుకున్నాడు. ★

## సింహపురి

(4వ పేజీ తరువాయి)

ఆయన ప్రసంగం షరా మామూలే. ఎన్టీ రామారావు పైన, ఆనం కుటుంబీకుల పైనా నిప్పులు కక్కాడు. జిల్లా ప్రజాపరిషత్ చేర్మెన్ ఎన్టీఆర్ అల్లుడికి డబ్బిచ్చి టిక్కెట్టు కొనుక్కున్నాడని; ఉపాధ్యక్షురాలు సుందర నాగేశ్వరి కోసంకూడా డబ్బుచెల్లించనిదే టిక్కెట్ రాలేదని తెలుగుదేశమంతా అవినీతిమయమని తిట్టాడు. ఆయన ప్రసంగం పూర్తయ్యేటప్పటికి రాత్రి 9.30 అయింది. అప్పుడుకూడా జనం ఓపికగా నిలబడ్డారంటే చెప్పుకోదగిన విషయమే!

### నెల్లూరు అథెలెటిక్స్ క్రీడలు ప్రారంభం

నెల్లూరు పోలీస్ పెరేడ్ గ్రౌండ్స్‌లో 27 తేది రాష్ట్ర గ్రామీణ అథెలెటిక్స్ క్రీడలు ప్రారంభమైనాయి. ఈ పోటీల్లో రాష్ట్రంలోని అన్నిజిల్లాల నుండి దాదాపు 800 మంది క్రీడాకారులు పాల్గొంటున్నారు. జిల్లా డెవలప్మెంట్ అధికారి శ్రీ టి. సత్యనారాయణరావు నిర్వహణలో ఈ క్రీడోత్సవాలు జరుగుతున్నాయి.

### సంస్కృత కళాశాల సన్మానం

నెల్లూరు శ్రీ వేదసంస్కృత కళాశాలలో 19 తేది శ్రీమదుభయభాషా సేవక సమితి ఆధ్వర్యంలో సాహిత్య సభ జరిగింది. సభకు తెలుగులెక్చరర్ శ్రీ తిప్పలు సుబ్రహ్మణ్యం అధ్యక్షించారు. శ్రీ దక్కిరాల శ్రీనివాసులు 'ప్రాచీన కవిత - ఆధునిక కవిత' అనే అంశంపై ప్రసంగించారు. "శక్తి-సౌరభాలు" అనే గేయకావ్యాన్ని రాసినందుకు వి. ఆర్. కాలేజి తెలుగు లెక్చరర్ శ్రీ సురభి నరసింహంను కాలేజి విద్యార్థి యూనియన్ తరపున కళాశాల ప్రిన్సిపాల్ దుశ్శాలువకప్పి సత్కరించారు. శ్రీ యన్. వి. రమణయ్య వందనాలు చెల్లించారు.

### వి. ఆర్. కాలేజి లెక్చరర్ల గోడు

నెల్లూరు వి. ఆర్. కాలేజిలో లెక్చరర్లకు సరియైన వసతులులేవట. ముఖ్యంగా మహిళాలెక్చరర్లకు లెట్రిన్స్ లేనందువల్ల పలుయిబ్బందులు పడుతున్నారట. ఈ లెక్చరర్లు కూర్చునేందుకు కూడా కుర్చీలు లేవట. కనీసం మంచినీటి సౌకర్యంకూడా వుండటంలేదని ఆవేదన వ్యక్తంచేస్తున్నారు ఒక వి. ఆర్. కాలేజి లెక్చరర్. మేనేజ్‌మెంటు కళ్ళుతెరచి పరిస్థితి చక్కదిద్దాలి.

### సింహపురి వాణిజ్య మండలి

ఇటీవల సింహపురి వాణిజ్య మండలి సర్వసభ్య సమావేశం జరిగింది. అధ్యక్షునుగా శ్రీ కవమర్లపూడి తిరుమలరావు, ఉపాధ్యక్షులుగా శ్రీ కంచెర్ల సుబ్రహ్మణ్యం గుప్తా, శ్రీ బచ్చు బ్రహ్మయ్య, కార్యదర్శులుగా శ్రీ దాసా లక్ష్మీనారాయణ, శ్రీ అమరా సుబ్బారావు, కోశాధికారిగా శ్రీ తిరివని వెంకటరత్నం ఎంపికైనారు.

### కార్యవర్గ సమావేశం

నెల్లూరు జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం కార్యవర్గ సమావేశం 28 తేది ఇందిరా కాంగ్రెస్ భవన్‌లో జరిగింది. సభను శ్రీ కె. యల్. నారాయణరావు అధ్యక్షించారు. ఈ సభలో స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ పుత్తేటి సుబ్రహ్మణ్యాచార్యులు, శ్రీ కోరాబత్తిన చిన్నయ్యల మరణానికి సంతాపాన్ని ప్రకటిస్తూ, పి. సి. సి. అధ్యక్షులుగా శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి నియమితులైనందుకు హర్షాన్ని వ్యక్తంచేశారు. ఇండ్లస్థలాల్ని గురించి సభ్యులుతెలిపి చర్చలుజరిపారు. ★

## పినాకినీతీరం

(2వ పేజీ తరువాయి)

గను పాటివంటి అభిమానులతో విశ్రాంతిగా తోయి హాయిగా చూడవచ్చి వుండవచ్చు గదా?

సోమశిల ప్రాజెక్టును జాతికి అంకితం చేయడానికి, ఆ వేదికమీదనే గోపాలరెడ్డి గారిని సన్మానించడానికి సమయ సందర్భాలేమిటి? ముందే ఏర్పాటైన కార్యక్రమమైతే ఆహ్వానపత్రికలలో వుండివుండాలిగదా? లేదే! శాల్వ సన్మానంకూడా ముందు అనుకున్నదికాదు, గోపాలరెడ్డిగారి కోసం తెప్పించిందీకాదు. తనకు ఒక తెలుగు శాసనసభ్యుడు వేసిన రెండు శాల్వలలో ఖరీదైనదానిని స్వంతం చేసుకొని, రెండవ దానితోగోపాలరెడ్డిగారినిసన్మానించి గొప్ప అనిపించుకున్నాడు రామారావు. అసంగతి గోపాలరెడ్డిగారికేమి తెలుసు? రామారావు గారుతనసహజధోరణిలో కాంగ్రెస్‌నుకోడి కొచ్చినట్లు తిట్టారు. నలభై ఏండ్లదేశాన్ని కాంగ్రెస్‌వాళ్ళు 'లూటీ' (దోపిడి) చేశారు అని నిందించారు. అదేవిధంగా కాంగ్రెస్‌ను కాంగ్రెస్ వారిలను దుమ్మెత్తిపోశారు. గోపాలరెడ్డిగారిని వేదికమీద ఆసీనులను చేసి, కాంగ్రెస్‌ను కాంగ్రెస్‌వారలనుఅంత నీచంగా తిట్టడమంటే, గోపాలరెడ్డిగారిని దూషించినట్లుకాదా? రామారావుగారు అంత నిర్లక్ష్యంగా మాట్లాడినతర్వాత గోపాలరెడ్డి గారు ఆవేదికమీద ఎట్లా కూర్చోగలిగారు? ఆయనచేత శాల్వ సన్మానం ఎట్లా చేయించుకోగలిగారు? ముఖ్యమంత్రికి సోమశిల సూపరింటెండింగు ఇంజనీరు గారిచ్చిన ఖరీదైన మెమెంటోను ఎట్లా అందజేయగలిగారు? ఆ వాతావరణాన్ని ఎట్లా సహించగలిగారు?

అంతటితో పోలేదు-కాటన్‌దొర రూపకల్పనచేసిన సోమశిలను రామారావుగారు పరిపూర్తి చేయగలిగారని ఆయన్ను అభినందించారట గోపాలరెడ్డిగారు. సోమశిలకు కాంగ్రెస్ చేసిందిఅల్పం; దాన్ని పూర్తిచేసిన ఘనత తెలుగుదేశం ప్రభుత్వానిదని రామారావుగారు పలికిన స్తోత్రకర్ణ చేశారు. గోపాలరెడ్డివంటి కాంగ్రెస్ పెద్దచేత సోమశిలను పూర్తిచేసిన కీర్తి రామారావుదేనని సంస్లోకించుకోగలిగాడంటే, కాంగ్రెస్‌వారి చేత కాంగ్రెస్‌వారినే తమ్ము పొడిపించడంతో సమానంకాదా?

సోమశిలకోసం ఎందరు ఎన్ని సంవత్సరాలపాటు తపస్సుచేయలేదు? కృష్ణ పెన్నా ప్రాజెక్టుపోయినా - తర్వాత సోమశిల ప్రాముఖ్యాన్ని గుర్తించి దానిని అవశ్యకతను నొక్కిచెప్పినవారు కె.ఎల్. రావు. కీర్తిశేషులు బెజవాడ రామచంద్రారెడ్డి, వంగల్లు కోదండరామరెడ్డి, ఏ. సి., జి.సి. కొండయ్య వంటి జిల్లాముఖ్యులెందరో దానికోసం ఆందోళనచేశారు. ఆంధ్ర గవర్నరు త్రివేది, కేంద్ర ఇర్రిగేషన్‌మంత్రి హాథీవంటి పెద్దలు ఎందరువచ్చి సోమశిలను చూడపోలేదు? సోమశిల, గండిపాలెంలకు శంకుస్థాపనచేసి, వెంటనే నిధులుమంజూరు చేసి,పనులుప్రారంభించిందికాంగ్రెస్‌ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు;కావలి, కనుపూరు కాల్వలకు పునాదిరాయి వడింది కాంగ్రెస్ ముఖ్యమంత్రి స్వర్గీయ సంజీవయ్య చేతులమీదుగానే. 1988 వరకు ఆ ప్రాజెక్టులకు నిధులు కేటాయించింది, అంతవరకు పని జరిపించింది కాంగ్రెసు ప్రభుత్వాలే. ఈ కృషిఅంతా బూడిదలోపోసిన పన్నీరై, రెండేళ్ళనాడే అనుభవానికొచ్చిన సోమశిలకు రెండవసారి ముఖ్యమంత్రిచేత ప్రారంభోత్సవం గావించబడడమే పొగడ్తలకు పాత్రంగావడం, అది గోపాలరెడ్డి గారివంటి కాంగ్రెస్ కురువృద్ధుని సమక్షంలో జరగడం, కాంగ్రెస్ దురదృష్టమనుకోవాలి-అంతే!

## పంచాంగం

### ముహూర్తములు

3 తేది దశమి శనివారం ఉదయం 10.50 గంటలకు మకరలగ్నమున వ్యాపార, వివాహ, గృహారంభములకు.

4 తేది ఏకాదశి ఆదివారం ఉదయం 10.41 గంటలకు మకరలగ్నము వ్యాపార వివాహములకు సుముహూర్తములు.

### డిసెంబర్ (కార్తీకమాసం)

### తిథులు

3 శని దశమి రా. 6.05 గం. వ.
4 ఆది ఏకాదశి రా. పూర్తిగ
5 సోమ ఏకాదశి ఉ. 7.04 గం. వ.
6 మంగళ ద్వాదశి ఉ. 8.47 గం. వ.
7 బుధ త్రయోదశి ఉ. 9.56 గం. వ.
8 గురు చతుర్దశి ఉ. 10.37 గం. వ.
9 శుక్ర అమావాస్య 10.46 గం. వ.

-స్వయంపాకుల శ్రీనివాసులు ఎం.ఎ.

# మలయాళ చిత్రం తెలుగు డబ్బింగ్ హక్కులు 12లక్షలిచ్చి కొన్నారు!

తెలుగు నిర్మాతలకు కథల కరువు. ఒకవేళ కథ దొరికినా దానికి అనుగుణంగా స్క్రీన్‌ప్లే మాటలు రాయించే ఓపిక, శ్రద్ధ, వ్యవధిలేవు. తమిళంలోగాని, కన్నడంలోగాని, మలయాళంలోగాని స్క్రిప్ట్ మీద కొన్ని నెలలపాటు ముందే కృషి చేస్తారు. సాంకేతికంగానూ ఎంతో వైవిధ్యం చూపిస్తారు. అందువల్లే కొమ్ములు తిరిగిన హీరోల చిత్రాలకు పోటీగా విడుదలైన డబ్బింగ్ చిత్రాలు వసూళ్ళలో స్ట్రెయిట్ చిత్రాలను మించిపోతున్నాయి. కమర్షియల్ ఫార్ములాతో తీసే తెలుగు స్ట్రెయిట్ చిత్రాలలో కథ, పాత్ర, స్వభావాలు, పాటల స్థాయిల చిత్రీకరణ ఒకేతీరున

### ఏమిటీ దౌర్భాగ్యం?

వుంటే, మన ప్రేక్షకులను బోర్ కొట్టించేవాయి గనుక వెరైటీగా వుంటుందని డబ్బింగ్ చిత్రాలు చూడడానికి ఎగబడుతున్నారు ప్రజలు. అందుకే ఇతరభాషల చిత్రాలవారు డబ్బింగ్ హక్కులను మన వాళ్ళకు అత్యధికరేట్లకు అమ్ముతున్నారు. మనవాళ్ళుకూడా పోటీలుపడి కొంటున్నారు. ఇటీవల ఒక మలయాళం చిత్రం రీమేక్ హక్కులను 12 లక్షలకు కొన్నాడు ఓ నిర్మాత! ఇంత దౌర్భాగ్యస్థితిలోవుంది ప్రస్తుతం తెలుగు చిత్రపరిశ్రమ. అంత డబ్బు తగలేసి అదరాబాదరాగా రీళ్ళు చుట్టేసి రాష్ట్రంమీదికి వదలడానికి బదులు నింపాదిగా ఒక చక్కని తెలుగు రచనను వెండితెరమీద ఎందుకు మలచకూడదు? హడావిడిగా డబ్బు సంపాదించాలని తాపత్రయపడే నిర్మాతలందరూ నిజంగా డబ్బు చేసుకుంటున్నారా? ఈ తంబలానికం లో తారలు, సాంకేతిక నిపుణులు తప్ప ఎవరు బాగుపడుతున్నారు? నిర్మాతలకు ఎప్పుడు కనువిప్పు కలుగుతుంది? ఎప్పుడు తెలుగు చిత్ర పరిశ్రమ బాగుపడుతుంది?

### కోర్టుకేసు

తమిళనాడులోగాని, కర్నాటకలోగాని, కేరళలోగాని ఏ జాతివయినా, కులాన్నయినా కించపరిచేరీతిలో సన్నివేశాలున్న ఏ చిత్రం ప్రదర్శింపబడినా ఆయా కులాలవారు వెంటనే ఆ చిత్రంమీద కేసు వేసి దర్శక నిర్మాతలను, పంపిణీదారులను, ప్రదర్శనశాలాధిపతులను కోర్టుకు ఈడుస్తారు.

ఈ విషయంలో మనవారు కాస్త వెనుకబడ్డారనే అనుకుంటూవచ్చారు నిర్మాతలు. అతే ఇటీవలే విడుదలైన "నేనూమీవాడినే" చిత్రంలోని కొన్ని సంభాషణలు, సన్నివేశాలు బ్రాహ్మణులను అగౌరవపరిచేవిగా ఉన్నాయని, గనుక ఆ చిత్ర ప్రదర్శనను ఆపివేయాలనికోరుతూ గుంటూరు వాస్తవ్యులు చర్లపల్లి వెంకటహనుమంతరావు, డాక్టర్ తాడిమళ్ళ కృష్ణకుమార్, శ్రీపతి పండితారాధ్యుల నరసింహమూర్తి నవంబర్ 11న గుంటూరు కోర్టులో పిటీషన్ దాఖలు చేశారు. ఈ చిత్ర దర్శకుడు కె. భాగ్యరాజ్, నిర్మాత అయిన ఆయన భార్య శ్రీమతి పూర్ణిమా భాగ్యరాజ్‌తోపాటు పంపిణీదారులు, థియేటర్ యజమానులు ప్రతివాదులుగా పిటీషన్లో పేర్కొనబడింది.

అసలీ తమిళ చిత్రం విడుదలైనవెంటనే తమిళనాడులోని బ్రాహ్మణ సంఘం వారు తమ తీవ్ర నిరసనను తెలియబరచి, సెన్సార్‌లో కొన్ని భాగాలను తీయించగలిగారు. కాని, తెలుగువారు ఇలాంటిది పట్టించుకోరని తమిళంలో తొలగించిన ఆ భాగాలను తెలుగు డబ్బింగ్‌లో అలా ఉంచేశారు. ఇప్పటికైనా మనవాళ్ళు మేలుకొనడం ముదావహం.

### కామేశ్వరరావు దర్శకత్వంలో "శ్రీ అయ్యప్ప పూజాఫలం"

పౌరాణిక చిత్ర బ్రహ్మ కమలాకర కామేశ్వరరావుకి చాలాకాలానికి ఒకచిత్రం వచ్చింది. అది శ్రీ జగదాంబ ఆర్ట్స్ నిర్మించే "శ్రీ అయ్యప్ప పూజాఫలం" అయ్యప్ప భక్తులను విపరీతంగా ఆకర్షించే రీతిలో ఈ చిత్రాన్ని నిర్మించడానికి కె. శారద, కోడం అంజనేయులు సన్నాహాలు చేస్తున్నారు. ★



"రాజకీయ చదరంగం" లో అక్కినేని నాగేశ్వరరావు

# అక్కినేని, కృష్ణ రాజకీయ చదరంగం!

పి. చంద్రశేఖరరెడ్డి స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో కృష్ణ సమర్పించే పద్మాలయ స్టూడియోస్‌వారి "రాజకీయ చదరంగం" చిత్రంలో అక్కినేని, కృష్ణ, సుజాత, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, చరణ్‌రాజ్, గుమ్మడి, బాలయ్య, కోట శ్రీనివాసరావు, ఈశ్వరరావు, బ్రహ్మానందం, చలసాని కృష్ణారావు, రామ్మోహన్, త్యాగరాజు, సుమిత్ర, గెస్ట్‌గా జమున నటిస్తున్నారు. నిర్వహణ: జి. ఆదిశేషగిరిరావు. నిర్మాత: జి. హనుమంతరావు. అయిదు సంవత్సరాల తర్వాత నాగభూషణం ఈచిత్రంలో నటించడం ఓ విశేషం.

### భానుమతి చలనచిత్ర స్వర్ణోత్సవం

డాక్టర్ భానుమతీ రామకృష్ణ చలన చిత్ర రంగంలో ప్రవేశించి 50 సంవత్సరాలైంది. ఈ సందర్భంగా ఈమె నటించిన "అత్త మెచ్చిన అల్లుడు" చిత్రం డిసెంబర్ 28న విడుదలకాబోతోంది. ఇందులో ఈమెతోపాటు కృష్ణ, జయప్రద, సత్యనారాయణ, బ్రహ్మచారులుగా విజయనిర్మల నటించారు. దర్శకత్వం : కోడి రామకృష్ణ. ★

# భారతాన్ని చూసి భయమా?

మన సినీమారంగ ప్రముఖులు ఒక్క విషయాన్ని మాత్రం సాధించగలిగారు. అది దూరదర్శన్‌లో 'మహాభారతం' ప్రసారసమయాన్ని మార్పించడం. 'మహాభారతం' వల్ల ఉదయపు ఆటలకు జనం బొత్తిగా రావడంలేదట. అందుకని ప్రసార సమయాన్ని మార్చాలంటూ ఢిల్లీకి టెలిగ్రాంలు, టెలెక్స్ మెసేజ్‌లు, అనేకవిజ్ఞాపనలు పంపారు. 'మహాభారతం'లా ప్రజలను ఆకట్టుకునే చిత్రాలను మనవాళ్ళు తీయగలిగితే, మన చిత్రాలకు 'మహాభారతం' పోటీకాగలదా? పౌరాణికచిత్రాలు తీయడంలో మనవారి తర్వాతే ఎవరైనా అనే అభిప్రాయం అందరికీ వుంది. పౌరాణికం కాకపోతే చక్కని సాంఘికచిత్రాలు తీసి ప్రేక్షకులను ఆకట్టుకోవచ్చుగదా? అంతేగాని, ఒకేమూసలో తయారుచేసినట్లున్న అర్థంపర్థంలేని సినిమాలుతీసి, జనం బొత్తిగా రావడంలేదని గోలపెట్టడమెందుకు? ఇది మన అసమర్థతను చాటుకోడా? 'మహాభారతం' ప్రసారసమయాన్ని మార్పినంతమాత్రాన థియేటర్లకు జనం వస్తారా? ఆడలేనమ్మ మద్దెలవాయిమీదపడి ఏడ్చినట్లుంది. ఎంత సిగ్గుచేటు?

### ఉపపాత్రధారుల ఇక్కట్లు

రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన సబ్సిడీలకు ఆశపడి చాలామంది నిర్మాతలు మన రాష్ట్రంలో పలుచోట్ల ఔట్‌డోర్‌లోనే చిత్రాలను షూట్ చేయడంవల్ల ఎంతో కాలంగా చిత్రపరిశ్రమను నమ్ముకొని మద్రాసులో స్థిరపడిపోయిన చిన్నచిన్న ఆర్టిస్టుల పరిస్థితి ఎంతో శోచనీయంగా వుంది. విశాఖపట్నం, రాజమండ్రిలాంటి చోట్ల ఇతర వుద్యోగాలు చేసుకుంటున్న స్థానిక కళాకారులే చిన్నచిన్న పాత్రలు ధరించేస్తున్నారు. హైదరాబాద్ లాంటి నగరాలలో బాగా ప్రాక్టీసువున్న డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లుసైతం సినిమామోజుతో చిన్నచిన్న వేషాలువేసేస్తున్నారు. ఇలాంటి వారికి డబ్బిచ్చినా- ఇవ్వకపోయినా ఫరవాలేదు. ఏదో కాస్సేపు తెరమీద కనబడే

### మద్రాసు సినిమా వార్తలు

లాంటి చిన్న వేషమిస్తేచాలు. ఇది మద్రాసులోని పేద కళాకారుల కడుపులు కొట్టినట్లయింది. మద్రాసులో వీళ్ళకు పనుగడ కష్టంగా వుంది. ఏ హైదరాబాదుకో సినిమాలవాళ్ళను నమ్మి వెళ్ళలేరు. వీళ్ళ పరిస్థితి దినదినగండంగా వుంది. కొందరు ఇంట్లోవున్న వస్తువులను అమ్ముకుని బ్రతుకుతున్నారు. వీళ్ళ కష్టాలను పట్టించుకునే నాథుడేలేడు. పేరుకొక ఆర్టిస్ట్ అసోసియేషన్ వుండేగాని, దాని కార్యాలయం ఎప్పుడూ మూసేవుంటుంది.

### ఎవరికి లాభం?

హైదరాబాద్‌లో ఎన్నో ఫిలిమ్ ఇన్‌స్టి

—తరువాత 11వ పేజీలో

# జిల్లావార్తలు

(6వ పేజీ తరువాయి)

నెల్లూరు యువకేంద్ర కార్యాలయంలో ఈ సంస్థ మెడ్రాసు... కార్యక్రమాన్ని కూడా చేపట్టింది. వరిపైరు సస్యరక్షణ సంబంధించి నెల్లూరు ఎ. డి. ఎ. ఓ. శ్రీ బాలాజీసింగ్ విస్తరణాధికారులతో క్విజ్ ప్రోగ్రాం నిర్వహించడం జరిగింది.

### వేగూరులో జూదం

కోవూరు మండలంలోని వేగూరు గ్రామంలో ప్రభుత్వ ఆస్పత్రి కోసం నిర్మిస్తున్న భవనాన్ని జూదరులు కొందరు ఆక్రమించుకొని రాత్రింబవళ్ళు అన్నదే జూదం ఆడుతున్నారట.

మెయిన్‌రోడ్డులోనే వున్న పోలీస్ సిబ్బందికు ఈ సంగతి తెలియదా!

### సర్వాయపాలెం దారిదోపిడీ

రావలి సమీపంలోని సర్వాయపాలెం రోడ్డులో 23 తేది రాత్రి 10 గంటల ప్రాంతంలో దారి దోపిడీ జరిగింది. ... ప్రసాద్, నారాయణ అనే వ్యక్తులను అడ్డగించి, వారి వద్దనున్న 700 రూపాయల నగదును, చేతిగడియారాలను ఇద్దరు దుండగులు బలవంతంగా పెరుక్కున్నారట. అంతటితో వదలిపెట్టకుండా వారిని కాళ్ళుచేతులు కట్టివేసి రోడ్డుపక్కన పడేశారట. తర్వాత అదేరోడ్డులో సర్వాయపాలెం వెళుతూ సైకిల్‌పై వెళుతున్న శ్రీనివాసరావు, మల్లికార్జునరావు అనే వ్యక్తులను కర్రలతో కొట్టి గాయపరిచారట. కాని వారిలో ఒక వ్యక్తి తిరగబడడంతో దుండగులు పారిపోయారట. అంతకుముందు ఆ దారిలో సైకిల్‌పై వెళుతున్న ఒక కుర్రవాడిని అడ్డగించి అతని వద్దవున్న సైకిల్ని గుంజుకుని అతన్ని కూడా కాళ్ళుచేతులుకట్టి చెట్లప్రక్కన పడేశారట. పోలీసులు కేసు దర్యాప్తు జరుపుతున్నారు.

★





### జనవాణి

(8వ పేజీ తరువాయి)

ఉపాధ్యాయులు నియామకానికై ఎదురు చూస్తూనేవున్నారు. ఈ సీ సం ప్రత్యేక ఉపాధ్యాయుల నియామకాన్నయినా చేపడితే, కొంతమందికైనా ఉద్యోగాలు లభించే అవకాశం కలుగుతుంది. దయచేసి ఆ. ప్ర. ప. శేర్మెనుగారు ఈవిషయంలో జోక్యంకల్పించుకుని నిరుద్యోగ ఉపాధ్యాయులకు ఉద్యోగాలు లభించే ఏర్పాట్లు చేయగలరని ఆశిస్తాను.

దుండిగం -ఎస్. వి. సుబ్బారావు

★

## • స్మృత్యంజలి •



నా భార్య, కలకాలం
నా హృదయంలో నిలిచిపోయిన
**శ్రీమతి సత్యాల**
**త్రిలోకసుందరి**
4-12-88 తేది ప్రథమ వర్ధంతి
సందర్భంలో ఆమెకు శ్రద్ధాంజలి
ఘటిస్తూ-

జననం : 6.?.1934
మరణం : 4.12.1987

గంగపట్నం వెంకయ్య
M.A.B.Ed.
1/82. చిన్నపడుగుపాడు (కోవూరు)

**The Nellore District Video Graphic Association**
(Regd)

## ప్రకటన

27-11-88 తేది నుండి వీడియోక్యాసెట్ బాడుగ కేసెట్ 1 కి రూ 10/- చొప్పున వసూలు చేయవలసిందిగా అసోసియేషన్ నిర్ణయించడమైనది. కావున ప్రతి లైబ్రరి యజమానులు పైవిధంగా బాడుగ వసూలుచేయవలసినదిగా కోరడమైనది. కష్టమర్లు పైమార్పును గమనించి మాతో సహకరించవలసినదిగా కోరుచున్నాము

ఐ. నవకోటి
ప్రెసిడెంట్,
నెల్లూరు డిస్ట్రిక్ట్ వీడియోగ్రాఫిక్ అసోసియేషన్.



Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, Nellore - 524 001